

పాలమూరు పేద బిడ్డ
అంతరాత్మలో పూసిన
పల్లె తెలంగాణ
ఆత్మ ఘోషను
పసిడి కన్నీళ్ళతో
తడిసిన నెత్తుటి ప్రవాహాన్ని
కలము సిరలో నింపి
కదిలొస్తున్నాడు అదిగో...
తెలంగాణ బానిస సంకెళ్ళు త్రెంచ
ఉద్యమానికి రెండు కన్నుల
వెలుగు నింపా....
పాలమూరు పల్లె బిడ్డ
తెలంగాణ పోరు ఉద్యమాల కూలిబిడ్డ...!

- బోల యాదయ్య

Hi-Tech_MBNR_9441049299

# జై తెలంగాణ

(ఉద్యమ కవితా సంపుటి)





# జై తెలంగాణ

(ఉద్యమ కవితా సంపుటి)

- బోల యాదయ్య ముదిరాజ్,
M.A. B.Ed.,
గ్రా॥ ధర్మాపూర్, మం॥జిల్లా. మహబూబ్‌నగర్.
సెల్ : 9912206427.

# జై తెలంగాణ
(ఉద్యమ కవితా సంపుటి)


| | | |
|---|---|---|
| రచన | : | బోల యాదయ్య |
| ప్రథమ ముద్రణ | : | సెప్టెంబర్ 2011 |
| వెల | : | రూ॥ 15/- |
| ప్రతులకు | : | బోల యాదయ్య<br>గ్రా॥ ధర్మాపూర్,<br>మం॥ జిల్లా. మహబూబ్‌నగర్. |
| అంకితం | : | తెలంగాణ రాష్ట్ర సాధనకై ప్రాణాలర్పించిన అమరవీరులకు, వారిని గన్న తల్లిదండ్రులకు |
| రచనలు | : | నా బి.ఇడి అనుభవాలు<br>తెలంగాణ ఆకలి కేక<br>ప్రేమ కావ్యం<br>పసిమొగ్గలు |




## కవిత్వం ఒక యుద్ధనౌక కవి

ఎందుకో ఈ మధ్య సాయం ప్రింగిన కాలం అయితేనే ఒక మెబ్బుపోర నాముందు నిలబడడానికి సాహసిస్తుంది. నాతల మీద వ్రేలాడుతున్న ఆకాశం అమాంతంగా సూర్యుణ్ని ప్రింగి కక్క లేక అది ఒక రోగిష్ఠి వాంతులుగా కురుస్తుంది. ఒక పిల్లవాడు వంటి మీద చొక్క, చొక్క క్రింద ఏమీ లేక ఎగురుకుంటు వానవచ్చె, వానవచ్చె పరుగుకు పాట నెర్పుతుండు పిల్లపాటగాడు.

ఇప్పుడు అంతటా పాట ప్రాణమైంది. ఇప్పుడెమిటి ! ఎప్పుడో భూమి మీద నీటి మూట విప్పిన మనిషి ఆకారం కొత్త సృష్టికోసం పురుడుపోసుకొని కాలాన్ని కన్నది చూడూ, అప్పుడే కాలం కదిలికకు ప్రాణమైంది పాట.

ఇదీ పాటల కాలం పాటల మీద అక్షరాలు గూడు కట్టుకుంటున్న కవుల కాలం. కవులను కంటున్న ఉద్యమాల కాలం. లేడిపిల్ల పక్షిపిల్ల చొక్క క్రింద ఏమీలేక ఎగురుతున్న పిల్లగాడు, పాటల వానలై పులుల మందను తరుముతున్న చరిత చలనకాలం, కొత్త సృష్టికాలం.

ఇదిగో చలన కాలం మీద పాట అక్షరం కల కలిపి ఒక పిడికిలి రక్తముద్ద పెడుతుండు పాలమూరు పిల్లోవాడు. పిల్లవాడంటే ఉత్తుత్తిగా యవ్వనాన్ని నిర్వీర్యం చేసుకొనే పిల్లవాడు కాదు. పిడుగుల ప్రతినిధి. కరువు వలసలు కన్నీళ్ళ నిలువెత్తు పాముపడగల క్రింద రాజకీయ శాపగ్రస్తురాలై పడివున్న పాలమూరు తల్లికి బిడ్డ ఈ అక్షర పిడుగుల ప్రతినిధి.

పాలమూరు చుట్టు పెనవెసుకొన్న తెలంగాణ మట్టి గుండె చప్పుడు ఈకవి బోల యాదయ్య. ప్రపంచంలో ఎక్కడ లేని విధంగ రెండు నదులు తెలంగాణ గడ్డ మీద మానవ శవాల గుట్టల నడుమ పారుతున్నవి దు:ఖనది. దానికి సమాంతరంగా త్యాగాల రక్త నది.

ఇక్కడ మనిషి మనిషిగా పుట్టలేదు. ముందు మనిషి పుట్టలేదు. చీకటిని చీకటి మీద మెబ్బులనీ రెండుగా చీల్చి, రక్తముద్దను ఆకాశం నుదటి తిలకం పెట్టి పోరాటం ముందు పుట్టింది.

ఢిల్లీకోట మీద ముఖాల మాస్కులు మార్చుకున్న అర్థరాత్రికి ముందు ఇక్కడ పోరాటం పుట్టింది. పోరాటం లోంచి మనిషి కెరటం పుట్టింది. తరువాత నది, నదులు పుట్టినవి.

విశ్వభూమి విముక్తి దిక్సూచికి ముఖచిత్రంగా, ఇండియా పోరాటాల చరిత్రకు సాయుధ పోరు మ్యానిఫెస్టోను అందించింది వీర తెలంగాణ.

కవి యాదయ్య నా మీద పెట్టిన బాధ్యతతో ఇంక లోపలికి పోకుండా కవి భుజం మీద చేయి వేస్తున్న.

అగష్టు అర్ధరాత్రి నుంచి డిశంబరు అర్ధరాత్రి వరకు తేనే పూసిన కత్తిగాయలు నా తెలంగాణ వంటి నిండా, ఆత్మ బలిదానాల విద్యార్థి త్యాగాల వనంలో ఇవ్వాళ్ళ తెలంగాణ కుట్రల కుంపటిలో ఒక నిప్పు రవ్వ. వలస పాలకుల గాంధీ టోపీల... బాబుల రాజకీయ కుష్ఠు రోగుల చదరంగంలో ఒకపావు.

పుట్టబోయే పిల్లలకు కూడా స్పష్టంగా కనిపిస్తుంది. వినిపిస్తుంది. తెలంగాణ ఆర్తనాదం. మరి ఎవరైనా ఎందుకు ప్రశ్నించారు. బోల యాదయ్య ఎందుకు ప్రశ్నించాడు ! ఎందుకు తిరగబడడు. కవి అన్నవాడు చరిత్ర తెలుసుకుంటున్నవాడు కొత్త చరిత్రకు రుణంగా నడకను ఇవ్వబోతున్నవాడు.

" మాకంటి ధారలలో కన్నీటి బిందులై
మా ఒంటి సేమటలలో సెలిమ నీళ్ళ ఊటలై
పాలకడలి తేనేలలో పాలవెల్లి వెల్లు వై
వెలువెత్తి వెలుగెత్తి తెలంగాణ ఉద్యమమై
కదిలొస్తున్న అమరవీరుల సాక్షిగా ...."

అమరుల వీరత్వం వంటికి పూసుకొని యుద్ధనౌక వారసునిగా యుద్ధనౌకతో వస్తున్నాడు.

" నిత్యం జీవన పోరాటం - నింగి నెల సుక్కల సాక్షిగా
నేలను ముద్దాడిన నెల వంక - వెన్నెల పొద్దులో
పొడుస్తున్న పోరుబాట - పొలిమెర సెలయేటి
అడుగుల నీడయై - తెలంగాణ ఉద్యమ పోరు "

ఎంత కవిత్వం ఈ బాల చంద్రుడి ఖడ్గం. బోల యాదయ్య కంఠస్వరం ధిక్కర కర్తవ్యం కవిత్వం.

కవిత్వానికి గజ్జెకట్టి ఎలా ఎగురుతున్నడో చూడండీ

" పోరాడుదాం పోరాడుదాం - తెలంగాణకై పోరాడుదాం
గల్లి గల్లినా పల్లె పల్లెనా తెలంగాణకై లొల్లి చేద్దాం
కాలికి మువ్వల గజ్జేలు గట్టి గల్లుగల్లుమనే సవ్వడి చేస్తున్నాం"



ఇదీ కవి గుండె క్రింద జలపాతం చేస్తున్న సవ్వడి
తెలంగాణ విశ్వ విద్యాలయాలు చేస్తున్న సవ్వడి
పంట సేను మీద పిట్టలు చేస్తున్న సవ్వడి పిట్టలమీద వాన
మబ్బు అలక సవ్వడి సమిష్టిగా ప్రజలు చేస్తున్న
సమర సవ్వడి. చావుకు కూడా వణుకు పుట్టిస్తున్న కొత్త జనన
మానవ క్రాంతి జ్వలన సవ్వడీ ఇదీ

సవ్వడి మీద అక్షరం పెట్టిండు బోలయాదయ్య

ఎక్కడ ఏ అక్షర సమూహాం నిమిరినా ఒక విద్యుచ్ఛక్తి ప్రవహాం అవుతున్నడు. దుఃఖం. వాస్తవిక, కసి, కలకలిపి" కవిత్వం ఒక యుద్ధనౌక కవి" అవుతున్నడు. అభినందిద్ధాం. గాఢంగా హత్తుకొని అండగా నిలబడుదాం. ఉద్యమానికి రేపటి మరో ఉద్యమానికి పదును తేలిన కత్తిలా నిలబెడుదాం. రండీ " కవిత్వం అగ్ని వీణ మీద వావలిన కవి"తో కరచాలనం చేద్దాం.!

కవి మిత్రులరా రండీ కవిత్వం ఉద్యమంగా స్వీకరించండి ! ఉద్యమంలో భాగంగా కవిత్వం రాయండి. ఉద్యమ మంటే... మనల్ని మనల్ని కాకుండా చేసే అనేక శక్తుల మీద, అనేక అనేక భ్రమల మీద, వ్యామోహాల మీద, నిర్బంధం... భయం మీద నిరంతరం అగ్నిపునీతంగా చేసే అనేక సమూహాల అంతర బహిర్ రావమ్ యుద్ధం ! యుద్ధంలో కవిత్వం ఒక ఆయుధం చేయండి. యుద్ధంలో భాగంగా కవిత్వం రాయండి. యుద్ధం లేకుండా శాంతి లేదు. చరిత్ర లేదు. ఒక చరిత్ర కోసం ఒక శాంతి కోసం రండీ ఒక యుద్ధం చేద్దాం ! యుద్ధంలో నిలబడ్డ యువ కవి యాదయ్యతో కరచాలనం చేద్దాం! కౌగిలించుకుందాం. కలిసి అడుగు ముందుకు వేద్దాం ! నూతన తెలంగాణకు, కొత్త మానవ సమాజానికి ఒక పిడికిలి మీద కవిత్వం ముద్ద పెడుదాం! ముద్దు పెడుదాం. !



-జనజ్వాల,
ప్రజాకవి, వనపర్తి

తేది : 03-09-2011

## -: ప్రస్తావన :-

ఇరవై ఏడు కవితలతో ఐదు పాటలతో వెలువరించిన 'జై తెలంగాణ' ఉద్యమ వచన కవితలు బోల యాదయ్య కలం నుండి వెలువడ్డాయి. ఎందరో మేధావులు, విద్యావంతులు, మహాకవులు, కవయిత్రులు, రచయితలు పుట్టిన పాలమూరు జిల్లాలో ఉరకలేస్తున్న తెలంగాణ ఉద్యమ స్ఫూర్తితో చక్కని తెలుగులో ఈ యువకవి రచన ఒకింత నన్ను ఆశ్చర్యానికి గురిచేసింది. కారణం వయస్సులో చిన్నవాడు. కానీ ఆలోచన విధానం చాలా పెద్దది కావడం. పద సంపద, భాషా సౌష్టవం తెలంగాణ ప్రజల నోట పల్కిన విజయ ధ్వాన నినాదాలు ఈ కవి తన కవితల్లో సూత్రబద్ధం చేసాడు.

తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు జరుగాలని కోరుకోవడం ప్రతి తెలంగాణీ పౌరుని అభిమతం. కానీ సమైక్య వాదపు చేతులలో చిక్కిందని తన కవిత " వేల గొంతుక లొక్కటై...! " కవిత గానం చేసాడు. నిలువెల్ల గాయాలతో తడిసిన - నిండు జనం గుండెలలో నిప్పుల రవ్వ జ్వాలలై ఎగిసిపడే ఉద్యమమా...! నిజమే ఎగిసిపడె అలపైకి లేస్తుందనే సత్యం సీమాంధ్రుల్ని ముంచుతుందనే విషయం గూఢంగా స్ఫూరిస్తుంది.

" మా తల్లి తెలంగాణ కవితలో " నిజాం గుండెల్లో నిదురించిన తెలంగాణ యోధులను కన్న పురిటి గడ్డ మాతల్లి తెలంగాణ అంటూనే అమరత్వం, వీరత్వర, త్యాగధనుల తల పండిన నా తెలంగాణ...!." అంటాడు. తెలంగాణ రాష్ట్రం పై ఒక చక్కని హేతుబద్ధత, స్పష్టత దాదాపు అన్ని కవితల్లో కనిపిస్తుంది.ఐదు పాటలు కూడా బావున్నాయి. ఈ కవి కాషాయాన్ని ఎరుపు రంగుతో కలబోసిన ఆలోచన విధానం పఠిత గుండె కొకింత ఉద్యమ చైతన్యం, ఆర్ద్రత, పోరాట పటిమ, త్యాగనిరతిని కలిగించక మానవు.

తెలంగాణ రాష్ట్రాన్ని చూడాలని అభిలషిస్తున్న సెజ్‌ల, మైనింగ్ దోపిడి, సీమాంధ్రుల పెత్తనాన్ని నిగ్గుదీసి ప్రశ్నిస్తున్నాడు. ప్రాణాలను పణ్ణంగా పెట్టవలసిన గతి ఎందుకు ? తొలి ప్రధాని చేసిన ప్రమాణం



ఏమాయెనని చరిత్రను జ్ఞప్తికి చేస్తున్నాడు. ఇక ఉప్పొంగిన ఉద్యమం కవితలో హైదరాబాదు మా సొత్తు కాదంటే మా కన్నీళ్ళలో కొట్టుకొని కృష్ణమ్మలో కూరుకపోతారని అంటాడు. కవికి ఆవేశం సహజం ఆవేశానికి అక్షరలాయుధలైతే ఇలాంటి అద్భుతమైన ఆలోచింపజేసె కవితలు బయటకు వస్తాయి.

బోలె యాదయ్యను చూస్తే బహుశా మూడు పదులు దాలటని వయస్సెమో అనిపిస్తుంది. కానీ కవితా రచన పరంగా చూస్తే పద ప్రయోగం, భావ ప్రకటన స్పష్టంగా అగుపిస్తాయి. ఇంకా ఈ యువకవి నిరంతర అధ్యయన శీలి అయితే ఇంకా ఎన్నో కవితలు మన ముందుకు తేగలడనిపిస్తుంది.

'మండె గుండెల సాక్షిగా...! అనే కవితలో 'నిత్యం జీవన పోరాటం నింగినేల సుక్కల సాక్షిగా నేలను ముద్దాడిన నెలవంక వెన్నెలపొద్దులో పొడుస్తున్న పోరుబాట...!' చక్కని అహింసావాదం అనంత భావ కవితనాదం కనిపిస్తున్నాయి. ప్రతి కవితలో తనదైన శైలి ధార లోతైన భావాలు సాక్షాత్కరిస్తాయి. తెలంగాణ విముక్తి ! ఏనాడో తొలి పొద్దుపొడిచే తెలుగు వెలుగు మనదని....! పోరాటాల నడిగడ్డ, వీరయోధుల విప్లవ శంఖారావం...! అంటాడు. నిజంగా తెలంగాణ ఏనాడో ఏర్పడిందని దాన్ని సీమాంధ్రులు ఏవిధంగా మార్పుచేసారో ఈ కవితలో గమనించవచ్చు. అనేక కవితల్లో...

ఉద్యమ నేపథ్యంలో తెలంగాణ రాష్ట్రావిర్భావానికి తనవంతుగా కాక తన పంతం నెగ్గించుకునే రీతిలో తన 'జై తెలంగాణ' కవితా సంకలనాన్ని స్నేహితుల సహకారంతో మనందరి ముందుకు తెచ్చిన బోల యాదయ్యను మనసారా అభినందిస్తూ, ఆశీర్వదిస్తూ...!



-గన్నోజు శ్రీనివాసాచారి
తెలుగు సాహిత్యారాధకుడు
పాలమూరు.

తేది : 05-09-2011

సెల్ : 9490145913

## నా హృదయ స్పందన

నా గుండెల్లో రగిలిన అక్షర పదాల జ్వాలలన్ని, అగ్నికెరటాల అగ్గి బావుటలై తెలంగాణ ద్రోహుల గుండెలలో నిట్టనిలువుగా దూసుకెళ్ళి ఉద్యమాన్ని జూస్తుంటే ఉవ్వెత్తున ఎగిసే ఆలోచనల అలలను ఆపటం నా హృదయ తరం కావడం లేదు. నిట్ట నిలువు కట్టగా నా మనస్సు నీడను అడ్డుకట్టిన ఆపలేకపోతుంది... ఎందుకంటే....

సీమాంధ్రోళ్ళ అరాచకాలు ఎన్ని, అన్ని చెప్పాలి. జల సంపద దోపిడి, వన సంపద దోపిడి అధిక నిధుల దోపిడి.... పదవుల దోపిడి... ప్రత్యేక రాష్ట్రమియ్యమంటే ప్రత్యేక పారామిలటరి బలగాలు దించుతుండ్రు. కళాశాల క్యాంపస్ ప్రాగంణంలో విద్యాకుసుమాలు విరభూయాలి గాని, రబ్బర్ బుల్లెట్ల వర్షం కురుస్తుంది. టియర్ గ్యాస్‌తోన పయర్ జేస్తుండ్రు. రాజ్యాంగం కల్పించిన నిరసన తెలిపే హక్కు తెలంగాణ ప్రజలకు వర్తించదా....?

610 జి.వో. పెద్ద మనుషులోప్పందం అన్నింటిని సీమాంధ్రోళ్ళు తుంగలో తొక్కారు. తెలంగాణకు తీరని అన్యాయం జేస్తున్నారు. అందుకే చరిత్ర నన్ను మరలి వెనక్కి చూడమంది... వెనక్కి చూస్తే... రక్తమరకలు చిదరింపులు, వెక్కిరింపులు...... ఆత్మబలిదానాలు అందుకే... రగిలింది నా హృదయం. అరిపోవు ఈ జ్వాలలు - తుది పోరులో అంతిమ విజయం వరకు - ప్రత్యేక రాష్ట్ర మిచ్చే వరకు పుట్టుకొస్తుంటాయి. పుట్టెడు ఉద్యమాలై, పట్టెడన్నం కోసం, పరాయి పాలన అంతం కోసం ఇలాంటి ఎన్నో ఉద్యమ అక్షర కవితల వెలుగు దీపాలు... వెలుగులోకి వస్తాయి... ఆదరిస్తారని.. ఆశిస్తూ....

-బోల యాదయ్య



## కృతజ్ఞతలు

తెలంగాణ ఉద్యమం ప్రతిరోజు నాగుండే నీడలో నిదురించి అన్ని వేళల నా గుండె నీడను వదలి పోకపోవడానికి కారణం అక్షర జ్ఞానం లేని నా తండ్రి బోల కిష్టయ్య, ఉద్యమ పాటలు, తెలంగాణ కష్టాలు, కన్నీళ్ళు, సాధక బాధలు విని దాదాపు 80-85 సంవత్సరాలు గల నా తండ్రి నాకు సత్తువ లెద్దురా బిడ్డా ఉంటే నేను పోరాడే వాని కాని... నువ్వు రాసేది ఏదైనా తెలంగాణలో చైతన్యం తెలవాలని జెప్పిండు... అందుకే మొదట దైవ సమానులైన నా తండ్రి గారి పాదాలకు నమస్కరిస్తున్నా.

నా కవి జీవితానికి ఒక సార్ధకత, కల్పించి అమూల్యమైన సందేశాన్ని రెండు గంటల పాటు బోధించి కడవరకు కవిగానే బతకలన్ని... నాలో స్ఫూర్తి నింపిన నా ఆరాధ్య గురువు. కవి జీవిత స్ఫూర్తి ప్రధాత - కలం యోధుడు ప్రజాకవి, జనం శ్వాస, జనజ్వాల గురువు గారికి....

పరిచయం లేకున్న అడిగిన వెంటనే గుండెకత్తుకొని - తన బిడ్డగా భావించి అక్షర దోషాలను సరిచేసి సలహాలు, సూచనలు ఇచ్చి ప్రోత్సహించిన గన్నోజు శ్రీనివాస చారి గురువు గారికి,

నాకు అన్ని వేళల అండా దండలందించిన యువ కవి మిత్రులు వేముల రంజిత్ కుమార్ గారికి,

నాకు పుస్తక ముద్రణకు ఆర్థికంగా సహకరించిన యస్. దేవినాథ్ (దేవరాజ్), రక్షయూత్ అసోసియేషన్ అధ్యక్షులు, మహబూబ్‌నగర్ గారికి, సంజీవ్ ముదిరాజ్ గారికి, ఎస్.పి. వెంకటేష్ గారికి, మున్నూరు రవి, డా॥ అమరేందర్ గారికి, ఫ్రెండ్స్ యువసేన సభ్యులకు, ధర్మాపూర్ గ్రామ పెద్దలకు మరియు నా కవితలను అందంగా అచ్చువేసిన హైటెక్ ప్రింటర్స్ వారికి మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు.

ప్రత్యేక కృతజ్ఞతలు : **గూడెం తిరుపతయ్య,** టి.ఆర్.ఎస్.

**టి. చంద్రుడు,** గారికి

## 1. వేల గొంతుక లొక్కటై....!

నీవురు గప్పిన నిప్పుల నిండు కొండ దండుల
నడుస్తుంది నడుస్తుంది తెలంగాణ ఉద్యమం
నిలువెల్ల గాయాలతో తడిసిన-నిండు జనం గుండెల్లో
నిప్పుల రవ్వల జ్వాలలై - ఎగిసిపడే ఉద్యమం
సామ్రాజ్యవాదుల - సమైక్యవాదుల
ఆటలిక అంతమనే - అరుణోదయ ఉద్యమం !
నిలువెల్ల గాయాలతో - నిత్యం సతమతమయె
పారాయెళ్ళ పాలనతో - పానం వెలదిస్తూ మా తల్లి తెలంగాణ
రగిలింది రగిలింది - తెలంగాణ ఉద్యమం
భూస్వాముల గుండెలో దడ బుట్టిస్తూ...!
నేల పంట పండించే - రైతన్న గుండె రగిలే
నేతనేసే నేతన్న - తన తలరాత మార్చమనే
ఉపాధ్యాయ, ఉద్యోగ, కార్మిక విద్యార్థులంతా
ఐక్య కార్యచరణనొంది - తెలంగాణ జెండా బట్టి
రగిలే రగిలే రగిలే - తెలంగాణ ఉద్యమం....!
కదులుతుంది కదులుతుంది - రగులుతుంది రగులుతుంది
దశాబ్దాల - బానిసత్వం - మాకొద్దని ఇక రద్దని
ముల్కి నిబంధనలు - ముంచిన మూర్ఖులారా !
పెద్ద మనుషుల ఒప్పందం పెద్దలలో కలిపినారా ?
మా భూములు - మా నీళ్ళు ఆంధ్రోళ్ళకు ఇలిటమయె
కరువు కాటకలతో - కన్నీళ్ళు ఒలకించే
పల్లె గుండె గొంతుక తడియారని మడియై
పసిడి పంటల పల్లె తెలంగాణ - పాడు సెజ్‌ల పేరిట
మోడువారే......... అందుకే
ఈ తెలంగాణ ఆకాంక్ష - మా తెలంగాణ కై ఆరాటం
మా తెలంగాణ రాష్ట్ర సాధనకై పోరాటం !



## 2. మా తల్లి తెలంగాణ

నిజాం గుండెల్లో నిదురించిన
తెలంగాణ యోధులను గన్న పురిటి గడ్డ మా తల్లి తెలంగాణ
అమరత్వం, వీరత్వం, త్యాగధనుల తలపండిన
మేధావులు, కవులు కొలువైన ఉద్యమాల అడ్డ ...!
మా (నా) తల్లి తెలంగాణ...!
రగులుతున్న, వేడి సేగల కొలిమిలో
ఎరుపెక్కిన, నిప్పుల కణికలను
నిలువేళ్ళ పేర్చిన-నిలువ నీడనిచ్చే
చల్లని తల్లి మా తల్లి తెలంగాణ.....!
కుట్రలు, కుతంత్రాలకు, మోసాలకు మోడువాడు
పల్లె కోయిలమ్మల కూని రాగాలు కరువై...
వచ్చే నవ తెలంగాణ వసంతానికై ఎదురుచూసే
మా తల్లి తెలంగాణ...!
బానిస సంకెళ్ళు త్రుంచ భావి యువత ఉద్యమించే
బండరాళ్ళ బతుకులు-బాగు చేయ చేయ్యి కలిపి
పదం పదం పాడుతూ, కదం కదం తొక్కుతూ
కదిలొచ్చె కళాకారులకు ఊపిరి నిలిపి జీవం పోసిన
ఉద్యమాల పోరుగడ్డ - మా తల్లి తెలంగాణ...!
ఎకసెకలు, వెటకారాలు - ఎన్నాళ్ళు భరించేది
జలదోపిడి వనదోపిడి - ఎన్నాళ్ళు ఎన్నెళ్ళు
ఆంధ్రోళ్ళ ఆగడాలు - ఇక సాగవు ఇక సాగవు
గడప గడప చేరింది పల్లె పల్లె కదిలింది - తెలంగాణ లొల్లి ...!
అమరవీరుల గన్న - అందెశ్రీ పుట్టిన
గద్దర్ గర్జించిన - ఉద్యమాల పురిటి గడ్డ
అమర తెలంగాణ - మా వీర తెలంగాణ...!

# 3. అనామకుని కలం...!

నేనొక అనామక పేద జీవిని...
గుక్కెడు నీళ్ళు దొరకని తెలంగాణ పల్లె వాసిని
కృష్ణమ్మ జలధారల సవ్వడి వింటూ,
జలము కళ్ళముందే కళకళలాడుతూ కదులుతుంటే
తరలించుకు పోతున్న జలసంపదను జూసి
నిద్రబోతున్న నా గుండే రగిలి మేల్కోనిన
తెలంగాణ ముద్దుబిడ్డను
నేనొక రాయిని, నేనొక రప్పని, తెలంగాణ ఉద్యమ తాకిడి స్పర్శకు
కలంపట్టి ప్రాణం - పోసుకున్న జీవశీలా రూపాన్ని
నేనొక నిప్పుల కుంపటిలో - ఇనుప ముక్కను...!
మా తెలంగాణ వాదం నన్ను......
కణ కణ మండే నిప్పుల కుంపటి నుండి,
ఎరుపు రంగు పూసిన నా దేహానికి
పదునైనా ఆయుధ రూపమిచ్చింది...!
మొద్దుబారిన నా చేతి వ్రేళ్ళలో
తడబడుతు ఇమిడి పోయె కలం
కన్నీళ్ళను సిరాలో నింపి, నగ్న సత్యాలను నిర్విఘ్నంగా
కన్నుల ముందు అక్షర కేళి చిత్రించే
ఎందుకు రాస్తున్నానో తెలియని ఆవేదనతో
ఆర్తనాదాల తెలంగాణను తలుస్తూ.....!
నేను కవినా, కర్తనా... కాదు కాదు - రగులుతున్న ఉద్యమ
తెలంగాణానికి నేనొక హేతువును...! ధాతువును.... ! కాదు కాదు కాదు.....
ఆంధ్రోళ్ళ పెత్తనంతో అలసిన, తిరగబడ్డ తెలంగాణ ముద్దుబిడ్డను
ఒపిక నశించి, శరీరం కృశించి కలం పట్టిన పల్లె కవిని...
అమరవీరుల, ఆత్మ పంపించిన తెలంగాణ గుండే ఘోషను
పాలమూరు నుంచి పాలించే ఢిల్లీ దాకా తెలంగాణ లొల్లి వినిపించే,
దగాపడ్డ తెలంగాణ - మద్దు బిడ్డను



# 4. తెలంగాణ రాష్ట్రాన్ని చూడాలి...!

సీమాంధ్రుల కొలిమిలో - కాలిపోయిన బతుకులు
ఆంధ్రోళ్ళ పాలనలో - అరిపోయిన దీపాలు
రాలిపోయిన విద్యా కుసుమాలు.....
బ్రహ్మరాతను సైతం వెక్కిరిస్తూ,
వెక్కిరింపుల పాలుజేసే - ఆంధ్రోళ్ళ పెత్తనం
తెలంగాణ పల్లె పంట పోలాలన్ని - సెజ్‌లు కబ్జాలు జేస్తూ...!
తెలంగాణ అటవిజాతుల, చెంచుజాతుల
బతుకులతో చెలగాటమా....
మైనింగ్ పేరిట మానవత్వాన్ని మరవటమా...!
తెలంగాణ గుండె నీడపై - ఒక్కొక్క వీరయోధుడు
నేలరాలి - తెలంగాణ ఆత్మ గౌరవాన్ని చూపించడమా...!
ప్రజాస్వామ్యమా - పారాయి పాలన
కాదు కాదు - ఇది సీమాంధ్రోళ్ళ రాజ్యం
ఇకవద్దు - ఇకరద్దు
ప్రాణాలను పణంగా పెట్టవలసిన గతి ఎందుకు...?
నిలువెల్ల (కలువ) కన్నుల ముందు ఆత్మతర్పణాలెందుకు...?
తోలి ప్రధాని చేసిన అనాటి ప్రమాణలేమయ్యె...?
పెద్ద మనుషులోప్పందానికి నిప్పంటించడమేనా...?
పోరాటలతో పోయెదేమి లేదు
బానిస బతుకు తప్ప...!
నేల రాళ్ళ వద్దు - వాడి పోవద్దు
తెలంగాణ విద్యార్థి మల్లె మొగ్గలారా...!
ఆపతరం ఎవరితరం - కారాదు కాలేదు తెలంగాణ రాష్ట్రం
కన్నులారా చూడాలి - కోటి కలల తెలంగాణాను
కడవరకు పోరాడుదాం - కాలము కరిగి
తెలంగాణ రాష్ట్రం ఒడిలో ఒరిగే వరకు...!

## 5. ఉప్పొంగిన ఉద్యమం...

తెలంగాణ సాధనకై - ఉవ్వెత్తున రగిలిన
ఉద్యమకారుల - బక్కసిక్కిన దేహాల నుండి
ఉప్పొంగిన స్వేదజలం - ఉద్యమాల ఏరులై
గల గలమని పారుతూ - తెలంగాణ నడిగడ్డన
ఉద్యమాల పోలికేక బెట్టి, ఉక్కు నరాల యువత - ఉప్పొంగే ఉద్యమమై
అణగద్రొక్కిన సీమాంధ్రోళ్ళపై ఆయుధా కెరటాలై లెగియాలి
వలస వాదులారా తెలుసుకోండి మీరు
మా గుండెను బండరాళ్ళతో పగులగొట్టిన
ధ్వనిస్తుంది, గర్జిస్తుంది. - తెలంగాణ నినాదమై
మా భూములు గుంజుకొని - మా నీళ్ళు దోచుకొని
మాపై మీ పెత్తనమా! మాపై మీ అరాచకమా !
మా కొలువులు లాక్కొని - మా పదవులు గుంజుకొని
రాజకీయమా ! వలసవాద రాజకీయ నాయకులారా... ఖబడ్దార్ !
ఎత్తిన తెలంగాణ జెండా - ఎగిరేవరకు వదలం
ప్రతి తెలంగాణ బిడ్డ ఆశయ సాధనకై
ప్రతి పల్లెనా - ప్రతి గల్లినా - ప్రతి మదిన నిండిన
తెలంగాణ స్వప్నం - నేరవేరే వరకు .....
నిరీక్షించి, నిరీక్షించి నిలువేళ్ల గాయలయ్యే
మా తల్లి తెలంగాణకు....!
తడిసి ముద్దయె - పసిడి తెలంగాణ
ఉస్మానియా క్యాంపస్‌లో - రబ్బర్ బుల్లెట్లతోన
ఓరుగల్లు చదువులమ్మ ఒడి....
వల వల కన్నీరు రాల్చి - ఎదురు తిరిగే బెబ్బులై
నాటి రాణి రుద్రమ వారసులై విద్యార్థి లోకమంతా !
హైద్రాబాద్ మా సొత్తు జై తెలంగాణ తొలిపొద్దు
కాదంటే మా కన్నీళ్ళలో కొట్టుకొని కృష్ణమ్మలో కురుకుపోతారు.
నాలుగుకోట్లమంది ఉక్కు నరాలతో - నవతెలంగాణ నిర్మాణానికి
నవతరం కదిలింది - యువతరం నడిపిస్తుంది. కాదంటే.....
కాదే నాగుల కొట్లాటే - తెలంగాణ వచ్చె వరకు తెగదెంపుల పంచాదే....!



## 6. సమర శంఖనాదం

సమర శంఖనాదం - స్వేచ్ఛా స్వాతంత్ర్య సాధనకై
బదంగిని బంధించి వధించిన వలసవాదులారా... !
అమరుడైనా - బదంగి అణువణువు
తెలంగాణ నినాదమై నేడు
వినీలాకాశంలో విజృంభిస్తు తెలంగాణ ఉద్యమానికి
ఊపిరిపోస్తుంది
అపతరమా అవకాశ సీమాంధ్రులారా ..!
దమ్ముంటే మా ధూం ధాం కు రండి
అగ్నిపర్వత లావాల ఉప్పొంగే
భావోద్వేగాల తెలంగాణ నినాదాలలో కొట్టుకుపోతారు.
దొడ్డి కొమరయ్య పుట్టిన గడ్డ
దొరల నెదిరించి - ఆంధ్రోళ్ళపై పిడికిలి బిగించి
తూటాలకు బలిపెట్టిన ప్రాణం ..!
నేడు తెలంగాణ మట్టిలో - పుట్టిన ప్రతి బిడ్డకి ప్రాణమై
నరనరాలలో పౌరుషమై నేడు - తెలంగాణ పోలికేక పెడుతుండ్రు
కదిలిస్తే నిప్పుల కణికలౌతుండ్రు
అడ్డుకుంటే - రాయల సీమాంధ్ర తీరానికి తరుముతుండ్రు
ఎదురోస్తే ఎడాపెడా లడాయె
తెలంగాణ ఇచ్చె వరకు - తెలంగాణ రాష్ట్రం పొద్దు పొడిచే వరకు

## 7. మండె గుండెల సాక్షిగా

నిత్యం జీవన పోరాటం – నింగినేల సుక్కల సాక్షిగా
నేలను ముద్దాడిన నెలవంక – వెన్నెల పొద్దులో
పోడుస్తున్న పోరు బాట – పొలిమెర సెలయేటి అడుగుల నీడయై
తెలంగాణ ఉద్యమ పోరు – తెలంగాణ ఉద్యమాల హోరు
త్యాగాల మేఘఫలం – గర్జించే ఉద్యమాల తుఫానులై
ఉద్యమాల దీక్షలో – పల్లె గల్లి జిల్లాలో.....!
అనునిత్యం ఆరాటం – తెలంగాణకై మా జీవన పోరాటం
కష్టించే కార్మికుల – కంటిలో బుట్టె ప్రతి కన్నీటి బిందువులు
నేలరాలి నేడు తెలంగాణ పోలికేక బెడుతుంది.
ఎండిన భూముల జూసి మండే గుండేల సాక్షిగా....
జలకన్య ఒడిలో మనమున్న – జలము రాక వాడిన పెదలను తడపకుండా
జల దోపిడి జేస్తున్న – జంతర్ మంతర్ గాళ్ళ జూసి
దశాబ్దాల పోరాటం – నిశ్శబ్దంగానే సాగే
కమిటీలు కంటితుడుపు చర్యలు కాలయాపన కొరకు
తెలంగాణ విముక్తి ఎనాడో – తొలిపొద్దు పొడిచే, తెలుగు వెలుగు మనదని
– ఆంధ్రలోన వీలినం జేసి, రజకార్ల గుండేలో రైలు పరుగెత్తించి
సాధించిన తెలంగాణ సామంతమయ్యె సీమాంధ్రోళ్ళకు...!
పోరాటాల గడ్డ – నడిగడ్డ – తెలంగాణ వీరయోధుల గన్న విప్లవ శంఖరావం
అంకురార్పణ చేసిన త్యాగాల పురిటి గడ్డ
నేడు నేతన్న నూలు వడికి అగ్గిపెట్టెలో అంచు చీరనుంచి ఖ్యాతి నోందే
నేడు కన్నీటి కడలిని కళ్ళలో నింపుకొని
వడికిన నూలునే మెడకు ఉరి తాడుగా ఉచ్చు బిగించే
సమైకాంధ్ర రాజ్యంలో సీమాంధ్రుల పక్షపాత పాలనలో
పొట్టకూటికి పోలిమెరదాటి దుబాయి కెళ్ళె బతుకులు – మనకెందుకు ?
బొంబాయి కెళ్ళె బతుకులు – మనకెందుకు....?
నీళ్ళులేక... భూమిలేక... ఖనిజ సంపదలేక......,కడకు కష్టించే తత్వంలేక....
కాదు కాదు... బతుకు దెరువుకు బాట జూపక
నడిపించే నాయకుడు లేక... కనిపెంచిన కన్నతల్లి బిడ్డల పరిపాలన రాక,
ఈ తెలంగాణ బానిస బతుకులు...!
ఇకవద్దు ! తెలంగాణే మనందరికి ముద్దు ....



## 8. తెలంగాణ అమరజ్యోతి

– (శ్రీకాంతచారి)

రగులుతున్న తెలంగాణ ఉద్యమ జ్వాలలన్నీ
అరిపోతున్న తరుణంలో – రవి కిరణ ఉషోదయమై
తెలంగాణకై నిలువేళ్ళ నిప్పుల మంటలను రగుల్చుకొని
తెలంగాణ తల్లి ఓడిలో వాలిన – వీర రత్నమా
తెలంగాణ అమరజ్యోతి అణిముత్యమా...!
నీ త్యాగం నిష్ఫలం కాదు – నీ గానం వృధా పోదు....
కళ్ళ నిండా కొట్టి సుడులు తిరిగిన కన్నీటి తరంగాలను
నిలువేళ్ళ దహిస్తుంటే – నినాదించావు జై తెలంగాణ అని
నీ గుండేల్లో దాచుకున్న రాయల సీమాంధ్రోళ్ళ ఆరాచకాలన్ని
నిన్ను దహించే మంటలో దహనం చేశావు.
కానీ... నీ మనస్సు మంటలో మండుతుంటే
నిన్ను కనిపెంచిన కన్నతల్లి ప్రేమ కానా రాలేదా....?
వేలుపట్టి నడిపించి వెన్నుతట్టి ప్రోత్సామించిన నాన్నా,
అనురాగం అగుపించలేదా... అపలేకపోయిందా...!
ఆపదలో అందించిన స్నేహమిత్ర కుసుమ మాల ...!
అభిమానను రాగాలు – అడ్డు కాలేదా... ?
ఆత్మాభిమానం కన్న – తెలంగాణ ఆత్మ గౌరవమే మిన్నయని
అరిపోతున్న తెలంగాణ ఉద్యమ దీపాన్ని
అగ్నికణలను ఒళ్ళంత నింపుకొని
సజీవ తెలంగాణ ఉద్యమానికి ఊపిరిపోసిన అమరజ్యోతివి నీవు
వేడి నీళ్లకే తాలని నీ ఓళ్ళంతా
తెలంగాణ రాష్ట్ర సాధనకై వేడిసెగల మంటలతో అంటించుకున్నావు ఒళ్ళంతా
తెలంగాణ మట్టి ఓడిలో – మరువని అమరుడవై వెలిగిన చారి !
చందమామ గుండేనీడలో – పొందుగా తొంగిజూసే నక్షత్రమా !
నింగి నేల పొద్దు పోడిసినంతకాలం – నీ రూపం నీత్యాగం
నిస్సందేహంగా అజరామరం...!
జోహార్ తెలంగాణ అమరవీరులకి –జోహార్ జోహార్

## 7. మండె గుండెల సాక్షిగా

నిత్యం జీవన పోరాటం – నింగినేల సుక్కల సాక్షిగా
నేలను ముద్దాడిన నెలవంక – వెన్నెల పొద్దులో
పొడుస్తున్న పోరు బాట – పోలిమెర సెలయేటి అడుగుల నీడయై
తెలంగాణ ఉద్యమ పోరు – తెలంగాణ ఉద్యమాల హోరు
త్యాగాల మేఘఫలం – గర్జించే ఉద్యమాల తుఫానులై
ఉద్యమాల దీక్షలో – పల్లె గల్లి జిల్లాలో.....!
అనునిత్యం ఆరాటం – తెలంగాణకై మా జీవన పోరాటం
కష్టించే కార్మికుల – కంటిలో బుట్టె ప్రతి కన్నీటి బిందువులు
నేలరాలి నేడు తెలంగాణ పోలికేక బెడుతుంది.
ఎండిన భూముల జూసి మండే గుండేల సాక్షిగా....
జలకన్య ఓడిలో మనమున్న – జలము రాక వాడిన పెదలను తడపకుండా
జల దోపిడి జేస్తున్న – జంతర్ మంతర్ గాళ్ళ జూసి
దశాబ్దాల పోరాటం – నిశ్శబ్దంగానే సాగే
కమిటీలు కంటితుడుపు చర్యలు కాలయాపన కొరకు
తెలంగాణ విముక్తి ఎనాడో – తొలిపొద్దు పొడిచే, తెలుగు వెలుగు మనదని
– ఆంధ్రలోన వీలినం జేసి, రజకార్ల గుండేలో రైలు పరుగెత్తించి
సాధించిన తెలంగాణ సామంతమయ్యె సీమాంధ్రోళ్ళకు...!
పోరాటాల గడ్డ – నడిగడ్డ – తెలంగాణ వీరయోధుల గన్న విప్లవ శంఖరావం
అంకురార్పణ చేసిన త్యాగాల పురిటి గడ్డ
నేడు నేతన్న నూలు వడికి అగ్గిపెట్టెలో అంచు చీరనుంచి ఖ్యాతి నోందే
నేడు కన్నీటి కడలిని కళ్ళలో నింపుకొని
వడికిన నూలునే మెడకు ఉరి తాడుగా ఉచ్చు బిగించే
సమైకాంధ్ర రాజ్యంలో సీమాంధ్రుల పక్షపాత పాలనలో
పొట్టకూటికి పోలిమెరదాటి దుబాయి కెళ్ళె బతుకులు – మనకెందుకు ?
బొంబాయి కెళ్ళె బతుకులు – మనకెందుకు....?
నీళ్ళులేక... భూమిలేక... ఖనిజ సంపదలేక......,కడకు కష్టించే తత్వంలేక....
కాదు కాదు... బతుకు దెరువుకు బాట జూపక
నడిపించే నాయకుడు లేక... కనిపెంచిన కన్నతల్లి బిడ్డల పరిపాలన రాక,
ఈ తెలంగాణ బానిస బతుకులు...!
ఇకవద్దు ! తెలంగాణే మనందరికి ముద్దు ....



## 8. తెలంగాణ అమరజ్యోతి

– (శ్రీకాంతచారి)

రగులుతున్న తెలంగాణ ఉద్యమ జ్వాలలన్నీ
అరిపోతున్న తరుణంలో – రవి కిరణ ఉషోదయమై
తెలంగాణకై నిలువేళ్ళ నిప్పుల మంటలను రగుల్చుకొని
తెలంగాణ తల్లి ఓడిలో వాలిన – వీర రత్నమా
తెలంగాణ అమరజ్యోతి ఆణిముత్యమా...!
నీ త్యాగం నిష్పలం కాదు – నీ గానం వృధా పోదు....
కళ్ళ నిండా కొట్టి సుడులు తిరిగిన కన్నీటి తరంగాలను
నిలువేళ్ళ దహిస్తుంటే – నినాదించావు జై తెలంగాణ అని
నీ గుండేల్లో దాచుకున్న రాయల సీమాంధ్రోళ్ళ ఆరాచకాలన్ని
నిన్ను దహించే మంటలో దహనం చేశావు.
కానీ... నీ మనస్సు మంటలో మండుతుంటే
నిన్ను కనిపెంచిన కన్నతల్లి ప్రేమ కానా రాలేదా...?
వేలుపట్టి నడిపించి వెన్నుతట్టి ప్రోత్సామించిన నాన్నా,
అనురాగం అగుపించలేదా... అపలేకపోయిందా...!
ఆపదలో అందించిన స్నేహమిత్ర కుసుమ మాల ...!
అభిమానను రాగాలు – అడ్డు కాలేదా... ?
ఆత్మాభిమానం కన్న – తెలంగాణ ఆత్మ గౌరవమే మిన్నయని
అరిపోతున్న తెలంగాణ ఉద్యమ దీపాన్ని
అగ్నికణలను ఒళ్ళంత నింపుకొని
సజీవ తెలంగాణ ఉద్యమానికి ఊపిరిపోసిన అమరజ్యోతివి నీవు
వేడి నీళ్లకే తాలని నీ ఓళ్ళంతా
తెలంగాణ రాష్ట్ర సాధనకై వేడిసేగల మంటలతో అంటించుకున్నావు ఒళ్ళంతా
తెలంగాణ మట్టి ఓడిలో – మరువని అమరుడవై వెలిగిన చారి !
చందమామ గుండేనీడలో – పొందుగా తొంగిజూసే నక్షత్రమా !
నింగి నేల పొద్దు పోడిసినంతకాలం – నీ రూపం నీత్యాగం
నిస్పందేహంగా అజరామరం...!
జోహార్ తెలంగాణ అమరవీరులకి –జోహార్ జోహార్

## 9. మౌన దీక్షతో...!

పరమ శివుడి పుడమి కంటిలో
త్రినేత్ర ఉగ్రరూపమై రగులుకునే తెలంగాణ ఉద్యమం
జనజాతర జాగృతినొంది - జనం జనం కదిలారు
గడప గడప గల్లి గల్లి లొల్లి జేసి, గర్జించే తెలంగాణ నేటి ఉద్యమం
ధర్నాలు, ధర్మయుద్ధానికై యావత్ విద్యార్థి లోకం
దాస్య శృంఖలలు ఛేధించ - సమరభేరి మోగించింది
జనసంఘ, కుల సంఘ అంగాంగ సంఘలన్నీ
ఐక్యకార్యచరణ అయ్యి అలై బలై ఆడుతూ
ఆత్మ బలిదానమైన బతికే తెలంగాణకై అని పోరు సలిపే
ఎక్కెక్కి ఎడిసే - ఎర్ర కలువలు,
వాడిన తెలంగాణ బీడు భూముల జూసి
నక్కి నక్కి దాగి మాపై గద్దెనెక్కి మా గంజినీళ్ళు తాగి-మా ఒట్లు లాగి
గంజినీళ్ళు లేని గరిబోలను జేసిన - ఆంధ్రోళ్ళతోత్తులారా
ఖబడ్దార్ ఖబడ్దార్ - కలిసి రావాలి తెలంగాణకై
పదవులు ప్రాణమంటే జూడు పొటెత్తే ఉద్యమ పోరులో
నడినెత్తి మాడే వరకు నలిగిపోతారు.
నల్లేరు నడక కాదు - మన తెలంగాణ
పల్లె పల్లె తోరణాల - పసిడి పూల పరిమళల
సిరి నవ్వుల తోట - మన తెలంగాణ
మౌన దీక్షలతోన మనం పోరాడుతుంటే
లాఠీలు, తూటాలతోన పోట్లాటలెందుకు...?
టీయర్ గ్యాస్‌తోన పయర్ జేస్తుండ్రు
టినెజోళ్ళమీద - కాలెజోళ్ళ మీద కాళ్ళు దువ్వుతుండ్రు
పరుగెత్తించి పరుగెత్తించి తరుముతుండ్రు



జై తెలంగాణ అన్నందుకు జైళ్ళో బెడుతుండ్రు
ఇది స్వాతంత్ర్య భారతమా.... ! ఇది స్వేచ్ఛా రాజ్యమా...
అణిగిన మా బతుకుల స్వేచ్ఛకై - అడిగే హక్కు లేదా
రగులుతున్న జ్వాలలలో కరిగిపోతు రాలుతున్న
మా కన్నీటి బిందువులు కనిపించడం లేదా
వాడి పోకముందే రాలిపోతున్న పసి హృదయాల
ఆత్మ స్పందన - జై తెలంగాణ అనే పోరుకేక
వినిపించడం లేదా, పరమేశ్వర కరుణించి
సీమాంధ్రుల కళ్ళు తెరిపించవా
తెలంగాణ రాష్ట్ర సాధనకు చేయూత నివ్వడానికి...!

## 10. తెలంగాణ జెండా ....!

ఊరురా జెండా ఎత్తి - ఉద్యమ జ్వాల రేపి
ఎరు సాగుకుంటు - మనం పోరు జెద్దామన్నా
పాలమూరు పోరుబాట - ఉద్యమాల తోట
నవాబు కాలమంట - నైజం పాలనంటా....
రజకార్ల రాజ్యంలో - ఎదురెళ్ళి పోరుజేసి
తరిమి తరిమి కొట్టిన - తెలంగాణ వారసులం
పల్లె పల్లెలోన గుడిసే సూరురాలి జూడు
నేడు తెలంగాణ పోరు జేసే ...
ఒట్టి కట్టెలు కూడా నిట్ట నిలువునా లేసి
పట పటమని తెలంగాణ పోట్లాట పోరుజేసే
కొడెనాగుల కోట్లట ఎప్పుడైనా
కరువు తెలంగాణను జేసిన కసాయెలపైనే...!
నిట్ట నిలువున ముంచిన సీమాంధ్రోళ్లపైనే.....!

## 11. ఆత్మ గౌరవ ఆశయ సాధనకై...!

సృష్టికి మూలం నీవంటా - ప్రతి సృష్టికి ధాతవు నీవంటా...
నీ ఒడిలో ఒరిగిన పాపకు ప్రాణం పోసిన జీవధాతవు నీవంటా
మాతృమూర్తివి నీవంట. ఆదిశక్తి రూపమే నివంటా
నన్ను గన్న తల్లి నాయమ్మ తెలంగాణ
అమ్మను మరచిన ఆత్మీయుడేవడైనా ఆత్మలేని దేహాంధుడే
బ్రతుకు నిచ్చిన తల్లి నీడన, నిప్పుల కుంపటినెట్టి
నిరేండ నీడలో నిల్పోబెట్టి నిన్ను దహిస్తుంటే
ఎన్నాళ్ళమ్మ నా తల్లి , తెలంగాణ సిరిమల్లి
ఓర్పు ఓర్పు అంటు ఓడిసిపోతావ్...
కార్చిచుబెట్టి కాల్చుతుంటే. కన్నీళ్ళతో కరిగిపోతావ్...
రగులుకుంది నీ ఒంటి చెమట
ఎగిసిపడే అగ్ని పర్వతజ్వాల రేణువులై...
అడ్డుతగిలె సీమాంధ్రుల గుండెల్లో రగలడానికి,
తెలంగాణ ఉద్యమ జ్వాలలై...!
స్త్రీ మూర్తుల కన్నులోంచి కురిసిన కన్నీళ్ళే నిప్పుల కణికలై
తెలంగాణకడ్డు తగిలె ఆంధ్ర వలసవాదుల పొలుసు వలసడానికి
కదిలినరదిగొ-ముందుండి నడిపించే ముత్యాల ముగ్గులేసే
చక్కనైనా చేతులెత్తి జై తెలంగాణని - నవ తెలంగాణ యువతులు
ఝాన్సీ వారసత్వాని పుణికి పుచ్చుకొని
వరంగల్ క్యాంపస్ వరదై ఉప్పొంగిన
జై తెలంగాణ నినాదాల హోరులో-
రాయల సీమాంధ్రుల శాసనాలను అగ్గిపెట్టి
పాలిత పీడిత ప్రజల ఆత్మ గౌరవ ఆశయా రూపమై
ఉవ్వెతున్న విజృంభిస్తున్న వీరవనితలారా ...!
తెలంగాణ తల్లి ఆత్మ గౌరవ బిడ్డలారా ...!
మీకు తెలంగాణ ఉద్యమాభివందనాలు...!



## 12. విడిపోయి కల్సుందాం...!

నిషేధజ్ఞాలను - ధిక్కరిస్తూ - వలయాలు చేధిస్తూ...
బళబళమని మెరుపులు మెరువంగా
పెళ్ళపెళ్ళమని మేఘులు గర్జించగా
హుస్సేన్ సాగర్ సాక్షిగా ఉవ్వేత్తున కదిలొచ్చిన
ఉద్యమస్ఫూర్తి నిండిన - ఉద్యమ కారులారా !
హలము బట్టె రైతన్న - పొలము దున్నలేక
కల్లం అంచున నిల్చోని కన్నీటితో మనస్సు కాల్చుకొనే
ఎండిన వాగుల జూసి - నెర్రెలిచ్చిన నేలను జూసి
ఎండిన బొక్కల జూసి గుండెను బాదుకునే ...!
ఆరాటం ఆరాటం అనుక్షణం పోరాటం
నిరీక్షణ నిరీక్షణ నిలువెళ్ళ నిరీక్షణ
కన్నులు అలసిపాయె... తనువు తరిగిపాయె....
అయినా నిరీక్షణ నిరీక్షణ
ఎన్నాళ్ళు ఎన్నెళ్ళు... ఏడాదికి ఏడాది. ఎటూ ఎటూ ఎదురుదెబ్బ
ఎంగిలి మెతుకులు వేసి.... వెక్కిరింపుల పాలు జేసి....
సిక్కులో పడదోసి - సిదరింపుల పాలుజేసి
కలిసుండమంటే - ఆంధ్రోళ్ళు
కాలం పక పక నవ్వే......
సూర్యుడు చామంతిలో దాగే....
కలిసుండడమంటే కొరివితో తలగొక్కినట్లేనని
కలిసి బతికినది చాలు - బతికి చెడినది చాలు
విడిపోదాం - విడిపోయి కలిసుందాం.

జై తెలంగాణ          జైజై తెలంగాణ

## 13. విద్యార్థి ఉద్యమం

దొరల భూస్వాముల పాలనలో
దీనవస్థను జూసిన దీనజనులం
పటేళ్ళు, పట్వారిల పంచన
పడిగాపులు గాసిన పల్లె సింగారాల అందాలం
దేశ్‌పాండేల, దేశ్‌ముఖ్‌ల
కర్కశత్వం నెదుర్కోనిన తెలంగాణ ధీరులం
జమీందారు, జగీర్ధారుల
జబర్‌దస్తిని అణగద్రొక్కిన పోరాట యోధుల వారసులం
నిజాం రజకార్ల సర్కారుకు నిప్పుబెట్టి
కారంపొడి రోకలి బండలతో తరిమికొట్టిన
తెలంగాణ వీర యోధులం....!
నాన్‌ముల్కి ఉద్యమానికి నాడు సారధులం
పెద్ద మనుషుల ఒప్పందానికి నిప్పంటించి
రగిలిన విద్యార్థి ఉద్యమానికి (1969) నాంది పలికిన
వలసవాద పెట్టుబడిదారి భూస్వాములరా...
ఖబడ్దార్... ఖబడ్దార్....
కదిపితే తేనె తెట్టల మౌతాం
నడిచోస్తే నిప్పుల కణికలమౌతం...!
శ్రీకృష్ణ కమిటితో కృష్ణ లీలల
కోట్లను కోట్లను ఖర్చు చేసి
ఎరికోరి చేసిందేంటి - పంచ సూత్రాలు తప్ప
తెలంగాణ బానిస బతుకులకు మోక్షమెపుడు
మోసపూరిత కమిటీలతో రాదు తెలంగాణ
ముడ్డిపూసలిరగొడితే - ముద్దుగిస్తారు తెలంగాణ...!



## 14. తెలంగాణ జ్వాల ...!

విష చిమ్మిలను వెన్నులో నింపుకొని
ఒలకబోస్తుంద్రు ఢిల్లీ పెద్దలతో
తెలంగాణ వాదం అణగద్రొక్కడానికి, సీమాంధ్రుల రాజకీయ వలసవాద భూస్వామ్య నాయకులు
ఢిల్లీ పెద్దలంత - ధీక్షభూని
అఖిల పక్షమంటారు - ఆంధ్రపక్షమే మేమంటారు.
అసెంబ్లీలో తీర్మానం అంటారు - మెజార్టీ మాదంటారు
సోగసనివ్వరు, పోగసనివ్వరు - తెలంగాణ నివ్వనివ్వరు...!
సీమాంధ్రోళ్ళు, అలుగుడా జూడు - వాళ్ళ సొత్తు అడిగినట్లు
రాజీనామా జేస్తానంటారు - రాజీలేదంటారు.
రాజకీయం జేసి జూస్తారు.....
మెజార్టీ మాదంటారు - మేమస్సలు తెలంగాణ ఇయ్యమంటారు
ఇచ్చెడెంది - సచ్చుడెంది ........... మీరు
ఇసుక తుఫానుల చెలరేగే ఉప్పెనై ఉద్యమం
ఈశ్వరుని మూడో కంటిలో బుట్టే.....
అగ్రహజ్వాలలు - అలుముకొక ముందే....
తెలంగాణ పంచాది తెగతెంచలే.....!
మా పొట్ట గొట్టి కూడా లాగి - గూడు కూల్చి గొడ గట్టి
ఇండస్ట్రీయల్ బెట్టి - ఇంటి భూమిలో వంటమనిషిని జేసి
మమ్ము మంట గలిపి - మల మల మాడ్చిన,
కలియుగ కళంకితులారా.. సీమాంధ్ర సంపన్నులారా....
జబర్‌దస్తి జమనా బొందబెట్టి
స్వర్ణాంధ్ర - హరితాంధ్ర జన్‌తానై సమైకాంధ్ర
జై బోలో తెలంగాణ !

జై బోలో తెలంగాణ

## 15. ధూం ధాం జనగర్జన

దగపడ్డా తెలంగాణ డప్పుల మోత
తిరగబడ్డ తెలంగాణ గుండెల సవ్వడి కూత
అణగద్రొక్కిన అణువణువు నిలువనీడ చీల్చుకుని
ఎదురు తిరిగే పిడికిలెత్తి సత్తువ కూడ దీసుకొని
దగపడ్డ తెలంగాణ దరువుల మోత
దగ దగ దండుల కదిలే పోరు కేకల కూత
మేమంత ఒక చెంత - నీటి బిందు తుంపరల
పోగు చేసి పోరుచేసి - సాగే సెలయెరై సాగి కదిలివస్తే
ఆ సేలయెటి పోకడలో - సెలమనీళ్ళ ఊటలకు
ఆ స్పర్శతాకే ప్రతి మట్టి కణం జీవం పోసుకొని
జై తెలంగాణ అని ఎదురేగి ఉద్యమ పోరు చేసే
అలై బలై - అసయ్-దులయ్ ఆటపాటలతో
ధూం ధాం - జనగర్జన జనజాతర సమరంతో
ఉద్యమ పోరు ఉద్యమహోరు....జేసే
ఉవ్వెత్తున్న సాగే తెలంగాణ ఉద్యమ జోరు
దగపడ్డ తెలంగాణ జీవన పోరు
నిప్పుల కణికలను ఒడిలో పెట్టుకొని నిలిసి చూసె దెన్నాళ్ళు
తెంచుడో.. పంచుడో... తెల్లాలే, తెలంగాణ బానిస బతుకులు తెల్లారాలే...
అరిపోతున్న తెలంగాణ దీపాన్ని, ఆత్మ తర్పణ చేసి వెలుగు నింపుతుండ్రు
నలిగిపోతున్న నాలుగున్నర కోట్లమంది బ్రతుకులలో
చిరునవ్వుల కోసం చిందేసి ఆడుతూ
తెలంగాణ ఆత్మ గౌరవాన్ని గడన గడప చెర్చిండ్రు
ఢిల్లీలో తెలంగాణ సెగ బుట్టెల.....పార్లమెంట్‌లో ప్రతిపక్షాల చేతిలో
జై తెలంగాణ నినాదంగా.....
పార్లమెంట్‌లో తెలంగాణ బిల్లు బెట్టలంటు పోరు జేస్తుండ్రు
కళ్ళు తెరవాలె కేంద్రం..........కోటికలల తెలంగాణ రాష్ట్ర మియ్యలే.......!
జై తెలంగాణ జైజై తెలంగాణ!!



## 16. తొలి పోరు ...!

పార్టీలు జెండాలు పక్కకెట్టి పాతరెట్టి
పాలు పంచుకోవాలె ప్రతి తెలంగాణ బిడ్డ
తెలంగాణ సాధనలో - తెలంగాణ ఉద్యమంలో...!
ఇల్లాలికి అలుకు జల్లి తెలంగాణ ముగ్గులేసి
తెగ తెంచె వరకు - తెలంగాణ లోల్లి మరవద్దు
ఎండ్లకు ఎండ్లు బెట్టిరి-కోట్లను కోట్లను కొల్లగొట్టిరి
సీమాంధ్ర దోపిడి భూర్జువాది నేతలు
సిరి సంపదలన్ని సిన్నబోయె
పల్లె అందాలన్ని - పక్క రాష్ట్రాలకు వలస వెళ్ళె
సింగారించిన పల్లెకొంగు-సిగపట్లతో ఆగచాట్ల పాలయె
ఎక్కెక్కి ఎడిసే-ఎండుటాకులు
పండుటాకుల - పలకరింపులు కరువైనందుకు
నిగరింపుల అడవి అందాల సోయగాలు
నిత్యం దహిస్తుంటే.........?
పచ్చని పరుపు మీద - వెచ్చని నిదురొస్తుందా...!
నీ జెండా నా జెండా తెలంగాణ ఎజెండా కావాలి అందరి జెండా
మన దేహంలో... పుట్టిన ప్రతి కణం నుండి
రాలిన ప్రతి కన్నీటి బోట్టు నుండి
అరిగిన బొక్కల సాక్షిగా... ఒరిగిన వనరుల ఒట్టుగా
నరనరాలలో నాట్యమాడే....!
రక్త సింధురాల పోలికేకల పోరుగర్జన సాక్షీగా
తెలంగాణ కొరకే తోలి పోరు చేయాలి !
మరవద్దు వదలద్దు - మడమ తిప్పని పోరు మనమే చేయాలి
జయహో తెలంగాణ ...! జయహే తెలంగాణ

## 17. తెలంగాణ వెలుగు ...!

పెనుగులాట ఎన్నాళ్ళు - పెకిలించు కూకటి వేళ్ళు
అడ్డమాదని ఆక్రమించి - భూములన్ని పట్టజేసుకొని
తరతరాల చరిత్రనంత - భ్రష్టు పట్టించిన దుష్టులరా
అల్లుకున్న పలుపుతాళ్ళను - బంధియైన బతుకు సంకెళ్ళను
మునిపంటితో ముసుగు తీసి - ఎరుపెక్కిన ఎర్ర కలువ కన్నులతో
కాల్చెను కన్నీళ్ళ మంటతో - మా తెలంగాణ నినాదం
సుప్రభాత శుభోదయం - మా తెలంగాణ నవోదయం
ఉద్యమ మంత ఉషోదయం - అమరులంత ఆకాశన అరుణోదయం
ఆత్మ గౌరవం సందేశం.....
నాలుగున్నర కోట్ల మంది నీరాజనం - తెలంగాణ నినాదం
తెలంగాణ సంస్కృతిలో - తెలుగు వెలుగు మనదని చేరి
పెనుగులాట లాడి - పినుగుల మమ్ముజేసి
కన్నులారా చూస్తున్నా సీమాంధ్రులారా....!
పండు వెన్నెల ప్రతిబింబమందు - నుండిరి వెలుగు జ్యోతులై
తెలంగాణ యోధులు - తెలంగాణ అమరులు
ఓడి ఓడి మోదువారే.....
ఓర్చి ఓర్చి ఒడిసిపాయె - తెలంగాణ సిరులన్ని
నిడివి లేక నడవలేక - పాలించే కన్న తల్లిలేక
పారాయెల చేతులో - అలన పాలన లేక
సమసిపాయే తెలంగాణ బిడ్డల బతుకులు...!



## 18. ఆక్రమణలు - వలసలు

పూసెటి వువ్వమ్మ - రాలేటి సినుకమ్మ
ఎదిగేటి ఓయమ్మ - నాపల్లె ఎడ్వకే నాయమ్మ
పురిటినొప్పుల బాధలోయమ్మ- పుట్టిన నాటి నుండే నాయమ్మ
ముసుగు తీసినారా - పసుపు పుసినారా...
పచ్చి బాలింతన్ని చూడకుండా నిన్ను
పనికెళ్ళమన్నరా - బోంబాయి వలసెళ్ళ మన్నరా
వలసవాద పరిపాలనలో వివక్ష జూపినారా
సిరులున్న నాపల్లె - నేడు సిన్నబోయినది
రాతి బావులోన్న నీళ్ళు - ఇంకిపోయినాయి
గుక్కెడు నీళ్ళు లేకుండా పల్లె
గూడు చెదురుతున్నది - గుండె జల్లుమంటున్నది
పల్లె కోయిల పాటలన్ని - నేడు వలస వెళ్ళినాయి
చేట్ల కొమ్మలెమో ఈడ చిగురు తొడిగినాయి
మానులెమో మోడువాడినాయి
చేతినిండా పని దొరుకుతుండే నాడు సేనులో
నేడు సేను లెకుండాయె - సెజ్‌ల పేరిట
లీజుకున్న సీమాంధ్రోళ్ళకు సొంతమాయె

## 19. నాలుగున్నరకోట్ల మంది జనశ్వాస (కె.సి.ఆర్.)

బక్కసిక్కిన దేహం - బరువునెత్తుకున్నది....
నాలుగున్నర కోట్లమంది శ్వాసను...
నరనరాలలో నింపుకొని... ఆ సత్తువ బలంతోనే
ప్రాణమైనాడు... పదిజిల్లాలకు...., పిడికిలెత్తి నినాదిస్తే...
పిడుగుల వర్షమై కురుస్తుంది. గొంతెత్తి గర్జిస్తే, గంగా ప్రవాహమై పారుతుంది.
అడుగేసి అలైబలై ఆడితే - ఢిల్లీ గద్దెన,
శబ్ద తరంగాలై ధ్వనిస్తుంది... నిలిసి జూస్తే అనామకుడు...
పోరుబాటలో నడిస్తే - ఉద్యమ జ్వాలకు సారథి
స్వేదం పండిన - రక్తం చిందిన, మడమ తిప్పని - పోరాట యోధుడు
గుండెలో గుదిబండలు దించిన - గళం మానడు తెలంగాణం వీడడు
అంకితభావం ఆశయ సాధనకై
ప్రాణమైన తృణప్రాయం - పది జిల్లాల రాష్ట్రం కోసం
సంస్కృతి సంప్రదాయ స్వపరిపాలన ధ్యేయంగా,
దీక్షభూని, స్వరాష్ట్ర సాధనకై, ఎటికోపాట పాడే కోయిలమ్మల నోట,
ఏకమై పాడించే తెలంగాణ జనం నోట జై తెలంగాణ పాట
ఢిల్లీ గద్దె దద్దరిల్లె ఉద్యమ నాయకుడి పోరుజూసి
సత్తువలేని నోట, కత్తుల మాటల తూటలై
పెళ్ళ పెళ్ళమని పెకిలించే తెలంగాణ అడ్డంకుల అడుగుజాడలను
నేను సచ్చుడో - తెలంగాణ ఇచ్చుడో తెలలని
అల్టిమెటం ఇచ్చె - సీమాంధ్ర సర్కారుకు, కేంద్ర ప్రభుత్వానికి
ఉద్యమ పోరుజూసి ఉదయించే తెలంగాణ ప్రకటన
కాని సీమాంధ్రోళ్ళ రాజకీయం - రాజీనామాల పేరిట
జెండాలు గిండాలు బొందలో బెట్టి ఏకమైరి
ఎట్టి తెలంగాణను జేయ ఏకసెకలాడిరి
మరో ప్రకటనతో ఉద్యమాన్ని మరిపించ జూసిరి
శ్రీకృష్ణ కమిటినేసి ఉద్యమానికి తూట్లు పొడిసిరి
పోరాట యోధునెంట మనముంటే
మన తెలంగాణ చరిత్ర మనమే రాసుకోవచ్చు.



## 20. ఎట్టి బతుకులు...!

ఓరన్నా ఓరన్నా నాపల్లె కూలన్న

కదిలిరారా పోరు జేద్దాము !

పల్లె తెలంగాణ - ఉద్యమాల పోరు జేద్దాము

తినిక్కె తిండి లేక ఉండనికే గూడులేక

చెదరిన బతుకులయెనా ఓ కూలన్న

ఎండలోన మాడిపోతివా !

ఎట్టి బతుకులు జేసి పట్టి పిప్పి జేసినరన్నా

పాడుబడె పల్లెటూరులు - సిరినవ్వుల పల్లెలో

బతకలేక వలస వెళ్ళిరా....

పసిడి పంటలో పొడిసే పొద్దులో

ఎగిసేటి ఎర్ర జ్వాలలే

ఉద్యమాల పోరు - ఉప్పెనల సాగే ఊరంత

అతుకుల బతుకులయె - చితికిన దేహమాయె

నేత, చేనేత దారుల మరమగ్గాలన్ని

బుగ్గిలోన భగ్గుమన్నాయి.

పోరాట యోధులింటా - పోరుగింటి పోరులంట

ఎన్నాళ్లు - ఎన్నెళ్ళోయన్న - మా కూలన్న

ఎదురు తిరిగి పోరు జేయ్యరా

## 21. అమరులకు జోహార్లు....!

అమరులరా వీరులారా - విప్లవాల జ్యోతులరా
రణరంగ క్షేత్రంలో - రగులుకున్న ఉద్యమంలో
అసువులు బాసిన - తెంగాణ పోరు బిడ్డలరా ....!
దుం దుడుకు దుశ్చర్యాలతో నిశ్చేష్టుల జేసి మమ్ము
మాపంటు రేపంటు - వాయిదాల వారమంటు
తెలంగాణ బతుకులతో - చెలగాట మాడిన సీమాంధ్ర నాయకులారా
చీము నెత్తురుంటే - సిరునవ్వుతో విడిచివెళ్ళు మా తెలంగాణను
నవాబు, నైజం, నాతాత ముత్తాతలంటు
ముత్యాల ముగ్గువోసి - ముగ్గువోసినంటావు తెలంగాణ పల్లెకు
నీ మాయి ముంతెడుందో - మరసిపోయిన నీ కన్నతల్లినడుగు
భారమని బతకలేమని వెతుకుంటు
తెలంగాణ పల్లె కొస్తే - అదరించి అధికారమిస్తే
గద్దె నెక్కి - మిద్దెనెక్కి పొద్దుగుంకె వేళ మాతో పోట్లాటకోస్తావా
ఒడిసిపోయి మేముంటే - బలిసిపోయి వాళుంద్రు
కూటికి లేక మెముంటే - కోట్లకు పడగెతింద్రు వాళ్ళు
ఎండకు కాలి మనముంటే - ఎసిగదులో వాళుంద్రు
నిధులు, విధులు మనవైతే - విధి విధానాల అమలు వాళ్ళది
బలిదానాలు మనవైతే - బలుపెక్కిన విమర్శలు వాళ్ళవి
కష్టం మనది - ఫలితం వాళ్ళకి, కన్నీళ్ళు మనకు - సుఖాలు వాళ్ళకి
ఇక చాలు.... ఇక చాలు.... కష్టం మనదే.... కన్నీళ్ళు మనవే....
ఆశయాలకై అమరుల త్యాగాలు మనవే....
కడకు హైద్రాబాద్ మనదే....
పోరుకొస్తే - పోలిమెర దాటెదాకా తరుముతాం
బతుకు దెరువు కొస్తే నీడనిచ్చి ఆశ్రయమిస్తాం
తెలంగాణ నడ్డుకుంటే - నడ్డివిరగొడతాం
తెలంగాణ గడ్డ విడిచే వరకు - బరిసెలతో తరుముతాం
జై తెలంగాణ
జైజై తెలంగాణ



## 22. ఎరుపెక్కిన తెలంగాణ....!

జూరాల డ్యాంమ్‌పై జుం జుం మనే నాథమా
జాతికే (తెలంగాణ) అంకితమా...!
సీమాంధ్రుల ఆగడలతో, పొంతన వోని తంతులతో, పోర్లిన పోరాటమా.
అర్లిన ఆరాటమా... అలల ప్రవాహమా...!
కోయిల్ సాగర్ కోనెటిలో కూసేటి (పారెటి) జలపాతమా....
పవళించిన నృత్యమా...! పాలమూరు తిన్నెలపై, కృష్ణమ్మ గుండెలపై
ఎగిసిన జలధారమా.... పోంగిన పాలమూరు పొలిమెర తీరమా...!
బీచ్‌పల్లి బీమ్‌లపై పాలమూరు కడుపులోంచి కదిలిన కవిత్వమా !
పారె సెలయెటి రాగామా ! అరిపోయె రైతుకంట్లో....
వెలిగిన ఓ దీపమా ...! ఆనంద బాష్పమా...!
కృష్ణమ్మ కురుల జడను అల్లిన ఓ బంధమా...!
నిండు వెన్నెల సంభ్రమా...!
గోదావరి గంగాధార... తెలంగాణ కడ కొంగున
తడిసిన జల ప్రవాహమా...! తిరుతెన్నుల సోయగామా..!
హోయలొాయలు ఓళికిస్తూ... సెలయెటి పొంగులై...
సెలిమ ఊటతోటలో, ఎండిన ఎండు టాకుల తెలంగాణ దారిలో
ఎరుపెక్కిన రుద్రామా...! పారేటి ప్రాణహిత మిత్రమా...!
జలమెళ్ళ నిలువెళ్ళ అలలపై అలరాడే
తెలంగాణ పాదాలు తడిసే.. కాని
ఎండిన గొంతులతో.. అరిన తరిపోలములతో
తల్లడిల్లె తెలంగాణ యావత్ ప్రజానీకం
సిరి జల సంపదలన్ని సీమాంధ్రుల వశమై
అన్యాయం రాజ్యమెలిన - ఆంధ్రుల పరిపాలనలో
ఆనాటి నుండి - నేటి తెలంగాణలో....!

## 23. స్వరాష్ట్రాభిలాష...!

కన్ననేల తల్లిని కనిపెంచిన తల్లిదండ్రుల నొదిలి
కాటికి కాలు చాచిన అవ్వతాతల నిడిసి
కలియ తిరిగిన ఉన్న ఊరునిడిసి....
ఉపాధి లేక ఉజ్వల భవిష్యత్ రాక
తెలంగాణ పల్లె నొదిలి తెల్లవారుఝామున
బోగిలెంబడ ఎక్కి బొంబాయి జేరితిమి
జేబులో చిల్లిగవ్వలేక - కడుపులో పిడికెడు కూడులేక
బతుకు దెరువుకు బానిసలమై....
బుక్కెడు బువ్వకోసం - గుక్కెడు నీళ్ళకోసం
గింజుకొని చస్తుండ్రు తెలంగాణ పల్లెలో
అన్న పానీయాల కోసం - తెలంగాణలో అమ్ముతుండ్రు పిల్లల్ని
కన్నపేగు కమ్రుతున్న - కన్నతల్లి కూడుపెట్టె స్తోమత లేక
ఈఏడు వచ్చేడు - కాలమైతదని కలిసోస్తాదని
వాయిదేసుకున్న సదువు ఆగమయిపాయె
పంటలెండిపాయె, పనులు లేకపాయె
నీళ్ళు లేకపాయె వానల జాడ లేకపాయె
కర్షకుల - కార్మికుల కన్నులలో కలతల సంతయె
పొంతనవోని పక్షపాత సీమాంధ్రుల పరిపాలనలో...!
తెలుగు జాతంత ఒకటండ్రు
తెలంగాణ బానిసలంటుండ్రు
విధులు, నిధులు పదవులన్ని
జన్మత: మాకంటుండ్రు
పుట్టు మూగల మమ్ము జేసి
పట్టణములను నేలుచున్న పాలిత సీమాంధ్రులారా
మీ పంచాన మా చెంచాలు



ూచేతి నీళ్ళు తాగుతుండ్రు
మోతబారిలు - మూల కడిరి
దేశ్‌ముఖ్‌ల, దేశ్‌పాండేల - జబర్‌దస్తిని
జమిందార్ల జాగిర్థారుల - గులాంగిరిని
పటేల్ పట్వారిల - పరిపాలన నెదిరించిన
పోరాటల పురిటిగడ్డ తెలంగాణ పోరుగడ్డ
పోలికేకల పోరుగడ్డ - తెలంగాణ వీరగడ్డ
సీమాంధ్రోళ్ళ పాలన ఆగమయె కాలమొచ్చె
రాయల సీమాంధ్రోళ్ళ పాలన అంతమె మా పంతం
స్వరాష్టాభీలాషే మా ధ్యేయం...!
నాలున్నర కోట్ల మందికి నజరానా.
నేటి తెలంగాణ కోటి రతనాల వీణా...!

## 24. దోపిడి ...!

అకాశదేశాన - హరివిల్లు నీడన
పొదరిల్లు మాటున - పోరుగింటి పొరయె
ఖనిజ వనరుల లొల్లి విని - కాటెసిరి మాటు వేసి
బోగ్గు గనులలో మగ్గి - మా బతుకులు మాడిపాయె
మల్లె మొగ్గల నీడరాక - మా పసిమొగ్గల బతుకు లారిపాయె
ఎగ్గుసిగ్గులేక ఎట్టి తెలంగాణను జేసి
ఏరు సాగుతున్న చోట - నీరు లేకుండా జేసిరి
సమసిపోయె సెలిమనీళ్ళ ఊటలు
తరి పోలములోన తడి లేకుండా పాయె
గుండెలోన గుబులు బుట్టె
పుట్టె ప్రతి తెలంగాణ బిడ్డ సేమట తీ
వలసలతోన అలసిపోయి
ఉపాధి నేరుగక ఊరు నిడిచిన పల్లెబి
ప్రతి తెలంగాణ జిల్లాలో - ప్రతి పల్లెల

## 25. ప్రజా యుద్ధనౌక - గద్దర్

ఉద్యమాల తొలిపొద్దు
ఉప్పెనల ఎగిసె ఆకాశమె హద్దు
కర్షక, కార్మికుల కంటిలో కన్నీళ్ళను, కడిగేసి
కూడు గూడు లెన్నోళ్ళకు కన్నకొడుకైన్నాడు.
దళిత జాతికి దరువై, దళారులకు కొరివై
ధరణి తెలంగాణపై పాటల గళమైన్నాడు.
భుర్జువా, భూస్వాములకు బుద్ధిజెప్పి
పేదజనుల కడుపుకు పెరుగన్నమైనాడు.
గళమెత్తి గర్జిస్తే - హిమలయ శిఖరాన
దరువులు మోత్తై మోగుతుది
గజ్జెల చప్పుడుతోన - గణగణమోతల తోన
నిర్మలంగా నున్న నీడన ఉరుముల మెరుపులు మెరిపిస్తాడు.
గంతేసి - చిందేసి - భుజాన ఎర్రని కండువేసి
కదిలి నడిచివస్తే ప్రజదళమంత కదిలే నివెంట
లాఠీలు - తూటాలతోన మొద్దు బారిన నీ శరీరానికి
అలసట ఎడుంది ఆరుపదులు దాటిన
నడుస్తున్న నవతరానికి - యుద్ధ నౌకై నివే పెద్ద దికైనావు
ప్రజా పోరాటమె నాపంతమని - ప్రజాపంట్‌ని బెట్టి
ప్రజల తెలంగాణకై - పోరు శూరుజేసినావు
దశాబ్దల ఉద్యమానికి-కేంద్ర బిందువు నీవు
దశాబ్దాల పోరాటానికి - ఆనవాలు నీవే
గర్జిస్తే - గద్దర్ ఎదిరిస్తే - ఖబడ్దార్
పోరుశూరుజేస్తే - ప్రజా యుద్ధనౌక
పాటల గళమైతే - ప్రజావాణికేక
డప్పుల దరువైతే- పేదోళ్ళ గుండే చప్పుడు
తెలంగాణ ఉద్యమంలో - కణ కణ మండే నిప్పుల కణం
ప్రజా నాయకుడి బాటలో పయనిద్దాం, ప్రజా తెలంగాణ సాధనకై తోడ్పడుదాం



## 26. గులాబీ జెండా ఎగరాలి...!

తెలంగాణ రాష్ట్ర సాధన విద్యార్థి నాయకులరా...
ఉద్వేగ, సందిగ్ద సమాచార మందిరంలో
మీ నాదుల నింద నినాదాల గని నింపుకొని
గర్జించి, గొంతెత్తి గళం వినిపించిన తెలంగాణ బిడ్డలారా
తన్నుడో తరిమెయుడో, పోట్లాడుడో-కోట్లాడుడో....
కోరుకున్నదొక్కటే కోటి రతనాల తెలంగాణను
విసురుడేంది, కొసురుడేంది - విధ్యార్థుల కొట్టుడేంది
అరువుడేంది అరచేయి ఎత్తడమేంది - తెలంగాణ
విద్యార్థి బిడ్డలమీద, రాజకీయంహకార తెలంగాణ ద్రోహులరా....
ఆంధ్రోళ్ళ తొత్తులరా.....
పురమాయించి పుకిలిస్తే వెలకిలపడే జిలకర్ర పోసలౌతారు
ఎదురు తిరిగి చెయ్యెత్తి జై తెలంగాణంటే,
మీ నీడలేని ఎముకల గూడులౌతారు...
ఎర్ర గూలబీ కండువా ఎగిరే మెడవంపుల
తలవంపులు తెచ్చె కళంకితుల సింహ స్వప్నమై
నై తెలంగాణ అంటే నుయ్యిలో తోయడమె
ఎదురోస్తే ఎద్దైనా ఎడాపెడా లడాయె
పోరు ఎపుడైనా జోరు విద్యార్థులదే
రవి కిరణమై రగిలే విద్యార్థి నాయకుడు
తెలంగాణ ఉద్యమ సాధనకు సారధియై
సిరినవ్వుల శినన్న శివతాండవ రుద్రుడాయె...
శివుడే సగభాగమై తెలంగాణ ఉద్యమంలో
వేన్నోళ్ళ మెదళ్ళకు వెంకటేష్ రాష్ట్ర సాధనకు పదును పెడుతుండు.
తెలంగాణ బిడ్డల కన్నీటి బిందువులన్ని కడలిని చేరుతుంటే
కడలి ఒడ్డు నుండి పోలం విడిచి పోరుబాట నడిచే పోల శ్రీశ్రీ
ఎన్నాళ్ళు, ఎన్నేళ్ళన్ని ఎదురు తిరిగే నాని తెలంగాణ కోసం
భరత్‌ను బందించిన, భగత్‌ను శిక్షించిన ఆగదు ఈ పోరు
తెలంగాణ నినాదాల హోరు....!

## 27. తెలంగాణ పోరాటం...!

ప॥ పోరాడుదాం పోరాడుదాం - తెలంగాణకై పోరాడుదాం
గల్లి గల్లినా, పల్లె పల్లెనా తెలంగాణకై లొల్లి జేద్దాం
కాలికి మువ్వల గజ్జెలు గట్టి - గల్లుగల్లుమనే సవ్వడి జేస్తూ ॥2॥
తెలంగాణ పోలికేకలు బేట్టి - సీమాంధ్రోళ్ళ గుండెల్లో అగ్గిని బెట్టి
॥ పోరాడు ॥

చ॥ లాఠిల్, తుటాల్ కొట్లాట కోచ్చిన
గాంధిజీ మార్గమునే మనము ఎంచుకొని
ఎగిరే జెండా ఎగిరే వరకు - తెలంగాణ మన మదిలో నిలిపి
టియర్ గ్యాస్‌తో పయర్ జేసిన - టినెజోళ్ళను జైల్లో బెట్టిన
॥ పోరాడు ॥

చ॥ క్యాంపస్‌లన్నీ పోరుగడ్డలే - ఉస్మానియా పోరుగడ్డల తల్లి
రాజకీయ నాయకులంతా - రంగు మార్చినా రూపు మార్చిన
ఎత్తిన జెండా ఎగిరే వరకు - ఎన్నాళ్లైనా ఎదురు ఉద్యమమే
॥ పోరాడు ॥

చ॥ పోరాడుదాం పోరాడుదాం - కడవరకు మనం పోరాడుదాం
సాధిదాం సాధిదాం - తెలంగాణ మనం సాధిద్దాం
ఎన్నాలైనా ఎన్నెలైనా వెన్ను చూపక పోరాడుదాం
ఎగరేద్దాం ఎగరేద్దాం - తెలంగాణ జెండా ఎగరెద్దాం.
॥ పోరాడు ॥



## 28. కావాలి తెలంగాణ

ప॥ రావాలి రావాలి రావాలి మన తెలంగాణ మనకు రావాలి
కావాలి కావాలి కావాలి మన తెలంగాణ మనకు కావాలి

చ॥ పల్లె పల్లెనా పిలుపురా
ప్రతి జిల్లా ప్రజల తలపురా
పసిడి పంటల తల్లిరా
నేడు పాడుబడిన వల్లిరా
పలక బలపం బట్ట లేదురా
వాళ్ళు అరక సెలక దున్నుతుండ్రురా
హైటెక్ బతుకు ఆంధ్రోనిది
ఆకలి బతుకు మనదయె.... అందుకే... ॥రావాలి॥

చ॥ ముద్దు ముచ్చట లేదురా
మనది మూడు కాలల ఎడుపురా... 2
వస్తే వరదొస్తది
వస్తే కరువోస్తది
తెలంగాణకే నిధుల కోరతాస్తాది... అందుకే ॥రావాలి॥

చ॥ నీడనిచ్చే చెట్టు కొమ్మరా
వనం గులాబీ పువ్వుల దండరా
రాష్ట్రా సాధనే ఎజెండా
తెలంగాన్నోలదే ఈ జేండా
తెలంగాణజేండా బట్టరా
తెలంగాణకై పోరు జేయరా ॥రావాలి॥

## 29. రగులుతున్న తెలంగాణ

ప॥ రగిలే రగిలే రగులుతుంది ఉద్యమం
కదిలే కదిలే కడ ఊపిరి వరకు
తెలంగాణ ఉద్యమం, తెలంగాణ ఉద్యమం

చ॥ మా కంటి ధారలలో కన్నీటి బిందులై
మా ఒంటి సేమటలలో సెలిమనీళ్ళ ఊటలై
పాలకడలి తేనెలలో పాలవెల్లి వెల్లువై
వెలువెత్తి వెలుగెత్తి తెలంగాణ ఉద్యమమై
కదిలోస్తున్న... అమరవీరుల సాక్షిగా ॥రగిలే॥

చ॥ మా గుండె గుడిలోన సుప్రభాత వేణువై
పలికించె నడిపించే పాడు బతుకులోద్దని
రగిలిన కిరణాలయి వెలుగు నింపడానికి
ఆంధ్రోళ్ళపై పోరుజేస్తూ అడుగు ముందుకెద్దాము
ఆవని ఓడిలో ఒరిగిన ఆ అమరజ్యోతుల ఆశయమై ॥రగిలే॥

చ॥ విశ్వ విద్యా ఆలయాలు - యుద్ధ నౌకలయోరా
తెలంగాణ ఉద్యమంలో - తొలి కిరణాలయెరా
లాఠీలు తుటాలు - కోట లెదురయినా
మా గుండె శ్వాసలే అదిమిపట్టి ఎదురు నిలిసి
కడదాకా పోరుజేస్తూ ప్రాణమైన అర్పిస్తాం
నా తల్లి తెలంగాణకై... అమరుడై వెలుగుతాను ॥రగిలే॥

చ॥ మా సేమట కన్నీళ్ళె ఎగిసిపడే అలలై
ముప్పేట ముంచెత్తి ఆంధ్రోళ్ళ గుండెలను
ఆపేవాడు నిలిపేవాడు - ఎవడు లేడు తెలంగాణను
అడోస్తే అడ్డంగా నరికైనా సాధిస్తాం. ॥రగిలే॥



## 30. స్వాతంత్ర్య మొచ్చిందా... తెలంగాణ పల్లెకు..

ప॥ స్వాతంత్ర్య మెదుంది - స్వాతంత్ర్య మెడోచ్చె
సీమాంధ్ర పాలనలో - స్వాతంత్ర్య మెడోచ్చె
పల్లెకు స్వాతంత్ర్య మెడోచ్చె
మోడువారిన పల్లెలు జూడు..... ఓ ఓ ఓ (2)
నలిగి పోయిన బతుకులు జూడు
తెలంగాణ గోడును జూడు
స్వాతంత్ర్య మెడోచ్చె - పల్లెకు స్వాతంత్ర్య మెడోచ్చె ॥స్వాతంత్ర్య॥

చ॥ కలికితురాయి కన్నీళ్ళ సోయి
తెలంగాణ పల్లెలకాయె
కాడి ఎద్దుల కావడి ఇరిగే
ఎండిన బొక్కల ఎదరోతయె
బతుకుదెరువుకై పాలమూరిలో..... ఓ ఓ ఓ (2)
వలస కెళ్ళిరి - బోంబాయి కెళ్ళిరి
స్వాతంత్ర్య మెడోచ్చె - పల్లెకు స్వాతంత్ర్య మెడోచ్చె ॥స్వాతంత్ర్య॥

చ॥ గుండె శోకాల గండాలయె
ఆత్మ తర్పణల అలజడులాయె
అడుగు అడుగునా అంక్షలాయె
పారా మిలటరి పాలనాయె
పారాయెళ్ళ పాలనలోన.... ఓ ఓ ఓ (2)
పది జిల్లాలు సామంతమాయె
స్వాతంత్ర్య మెడోచ్చె - పల్లెకు స్వాతంత్ర్య మెడోచ్చె ॥ స్వాతంత్ర్య॥

# 31. ఉద్యమ జ్యోతులై తిరిగొస్తారా...!

ప॥ అమరులై వెళ్ళుతున్నారా... మీరు
పొద్దయి పొడుస్తున్నారా...
కెరటమై ఎగిసినారా.... మీరు
కాలి బుడిదయినారా

చ॥ వేనోళ్ళ గొంతుకల నాదమై పాడింది
ఏడ ఉన్నారో బిడ్డలు ఏడున్నారని
కన్నతల్లి గుండె నిప్పుల్లో కాలింది
అన్నదమ్ముల ఆత్మ చితిమంట నీడైంది
పల్లె కోయిల పాట మూగబోయింది. (2)
మిమ్ము సూడనిదే పాట పాడనంది. ॥అమరులై॥

చ॥ పది జిల్లాలోన పల్లవై సాగింది
పేరు పేరున తలిసి బోరుమంటుండ్రు
నివాళి పేరుతో నిన్ను తలిసిండ్రు
గుండెలో ఒక పక్క మిమ్ము దాసిండ్రు
జ్యోతులై తిరిగొస్తారా మీరు
మాతో పోరుకై కలిసోస్తారా.